# MATRICULATION EXAMINATION

## *March – 1959*

## CIVICS

1. దక్షులకును బాధ్యతలకును గల అన్యోన్య సంబంధము వివరింపుడు.

జ. ప్రతి వ్యక్తియు తన స్వార్థమును సంపాదించుటకు కొన్ని కోరికలు కలిగియుండును. అట్టి కోరికలు న్యాయశాస్త్ర సమ్మతములైనపుడు అవి హక్కులు, లేక స్వత్వములు(Rights) అనబడును. వ్యక్తిజీవితమునకు హక్కులు మూలాధారములు. ప్రతి పౌరుడును తనకు గల హక్కులను నిరాటంకముగా అనుభవింప గలిగినపుడే జీవితము సౌకర్యముగ నుండును.

హక్కులు అనేక విధములు, శాసనరీత్యా లభించు హక్కులు కొన్ని. మరికొన్ని హక్కులు నైతికములని చెప్పబడును. పౌరసత్వము అనునవి కొన్ని గలవు. రాజకీయపు హక్కులు, సాంఘిక హక్కులు గూడ గలవు. మత సంబంధమైన హక్కులు గూడ కొన్ని యుండును. వ్యక్తి స్వాతంత్ర్యము, ఆస్తిప్రాణముల సంరక్షణ హక్కు, వాక్స్వాతంత్ర్యపు హక్కు, సమావేశపు హక్కు ఇవి ప్రాతిపదిక హక్కులు (Fundamental Rights) అనబడును.

హక్కులు కాలానుగుణ్యముగా మారుచుండును. సంఘాచారములలోను, అభిప్రాయములలోను మార్పులను బట్టి హక్కుల స్వభావము మారుచుండును. బానిసలను కొనుటకును, అమ్ముటకును కొంతకాలము క్రిందట శాసనరీత్యా హక్కు ఉండెడిది. కాని ఇప్పుడది అమానుష కృత్యముగా భావింపబడుటచే చట్టరీత్యా నిషేధింపబడినది. హరిజనులు దేవాలయములో ప్రవేశించుటకు ఇదివరలో సాంఘికముగా ఆటంకముండెడిది. కాని భారతరాజ్యాంగ చట్టమును బట్టి దేవాలయ ప్రవేశమునకు హరిజనులకు హక్కు ఏర్పడినది,

ఎలక్షనులలో వోటు ఇచ్చుటకు వయోజనుల కందరికిని హక్కు గలదు. ఇది పౌరసత్వములలో చేరినది.

పౌరులు తమ హక్కులకు భంగము కల్గినదని తలచినచో న్యాయస్థానముల ద్వారా తమ హక్కు నిలబెట్టుకొనవచ్చును. సాధారణముగా ప్రతి వ్యక్తికిని తన హక్కులను నిలబెట్టుకొనుటలో మిక్కిలి పట్టుదలయును, ఉత్సాహమును ఉండును.

ప్రతి పౌరునకు హక్కులున్నట్లే కొన్ని విధులు (Duties) కూడ ఉన్నవి. పౌరులకు వోటింగు హక్కు గలదు. దానితోబాటు ఆ వోటు హక్కును సక్రమముగా వినియోగించవలసిన విధి గూడ గలదు. వోటు నిచ్చుటలో పక్షపాతముగాని, దురభిమానముగాని చూపరాదు. ఎన్నికలలో ఉత్సాహముగా పాల్గొనవలెను. ప్రజాప్రతినిధి సంస్థలలో అంతఃకరణమును బట్టి సభ్యత్వము నిర్వహింపవలెను. శాంతి సంరక్షణలోను, ఆస్తి ప్రాణ సంరక్షణలోను ప్రభుత్వ సహాయము పొందుటకు పౌరులకు హక్కు గలదు. అట్లే పోలీసు సిబ్బంది మొదలైన వాటి ఖర్చుల క్రింద పన్నులు పౌరులందరు సక్రమముగా సకాలములో చెల్లింపవలసిన విధి గలదు. శాసనసభ్యుడుగా ఎన్నుకొనబడుటకు వయోజనులకు హక్కున్నది. ఆ విధముగనే శాసనముల యెడల విధేయత చూపవలసిన బాధ్యత, లేక విధి ప్రతి పౌరునకును గలదు.

ఈ యుదాహరణలను బట్టి హక్కులును విధులును అవినాభావముగ సంబంధించి యున్నవి. రాజ్యాంగము ద్వారా గాని సంఘము మూలమున గాని శాసనముల రీత్యాగాని కొన్ని హక్కుల ననుభవింపగోరు ప్రతి వ్యక్తియు వాటియెడల తనకు గల విధులు నిర్వర్తించుట తప్పనిసరి యగుచున్నది. సంఘము నందలి ఇతర వ్యక్తుల వలన తన కెట్టి హానియు కలుగకుండ కాపాడుకొను హక్కును చలాయించ గోరువారెల్లరును ఇతరులకు తామెట్టి హానియు కలుగజేయక యుండు విధిని పాటింపవలసి యుండును.

పౌరులు తమ హక్కులను విధులను సక్రమముగా గ్రహింపనిచో సంఘము నందు తగాదాలును సంఘర్షణయు వృద్ధిబొందును. అట్లుగాక

పౌరశాస్త్రమునందు సిద్ధాంతరీత్యా అభ్యసించిన హక్కులను విధులను క్రమముగా ఆచరణలో నుంచినచో సంఘశ్రేయస్సునకును జాతిశ్రేయస్సునకును తోడ్పడిన వారగుదురు.

**2. ఉత్తమ పౌరుని లక్షణములు వర్ణింపుడు.**

జ. ఒక రాజ్యాంగ మిచ్చు హక్కులను సక్రమముగా వినియోగించుకొని రాజ్యాంగము యెడల తనకు గల విధులను క్రమముగా నెరవేర్చువాడు పౌరు డనబడును. రాజ్యాంగముతో బాటు పౌరుడును అనేకమగు సంస్థలతో సంబంధము కలిగియుండును. కనుక వేర్వేరు సంస్థల యెడల తనకు గల అభిమానములను పౌరుడు సమైక్యత గల్గించుకొనవలసియుండును. ఇట్టి సమైక్యత గల్గించుకొనగల శక్తియే పౌరున కుండవలసిన ముఖ్య లక్షణము. సాంఘిక న్యాయమునకును, క్రమ పరివర్తనమునకును తోడ్పడుట కూడ పౌర లక్షణములలో ముఖ్యమైనది. ఇట్లు పౌరత్వము అనేక గుణముల సముదాయమై యున్నది.

ఇవి యిట్లుండగా హక్కులను క్రమముగా అనుభవించుటయు, విధులను క్రమముగా నెరవేర్చుట అను రెండు విషయములును మంచి పౌరుని లక్షణములని చెప్పవచ్చును.

హక్కులను అనుభవించుట అనగా రాజకీయ హక్కులను సరియైన పద్ధతిని వినియోగించుట అని యర్థము. ప్రధానముగా మంచి పౌరుడు తనకు గల వోటింగు హక్కును నిష్పాక్షికముగను, నిస్వార్థముగను వినియోగించుటలో శ్రద్ధ వహించును. శాసన సభలు, పురపాలక సంఘములలో సభ్యత్వము పొంది జాతి శ్రేయస్సున కాపదవిని ఉపయోగించును.

హక్కు అనుభవించుటలో శ్రద్ధ వహించుటతోపాటు మంచి పౌరుడు తన విధులను నెరవేర్చుటలో ఉత్సాహము చూపును. శాసనములకు లోబడి సంచరించుట మంచి పౌరుని ముఖ్య లక్షణము. సంఘ శ్రేయస్సు కొరకే చట్టములు చేయబడుచున్నవి. కనుక చట్ట సమ్మతమగు ప్రవర్తన సంఘ

క్షేమమునకు పునాదియై యున్నది. ప్రభుత్వము విధించు పన్నులను మంచి పౌరుడు సకాలమున చెల్లించుటకు శ్రద్ధ బూనును. పన్నులు ఎగ కొట్టుటకు యత్నించుట మంచి పౌరుల లక్షణ మెంతమాత్రమును కాదు. ప్రభుత్వమునకు చెల్లించవలసిన ధనము సరిగా చెల్లింపనిచో ప్రభుత్వము నిర్వహింపవలసిన కార్యభారము నెరవేర్పజాలదు.

మంచి పౌరున కుండవలసిన ముఖ్యగుణము దేశాభిమానము. శత్రువుల నెదుర్కొని దేశమును రక్షించుటలో అవసరమైనపుడు సైన్యములో చేరి ప్రాణమునుగూడ విడుచుటకు సంసిద్ధుడై యుండవలెను. ప్రజాశాంతిని, ప్రజారోగ్యమును కాపాడుటలో సత్పౌరుడు ప్రభుత్వముతో సహకరించును. అక్షరాస్యత వృద్ధిచేయుటలోను దారిద్ర్య నిర్మూలనమందును గూడ మంచి పౌరుడు తోడ్పడును. జాతికి చెందిన సంస్కృతికి తగిన స్థానము లభించునట్లును కళాపోషణకును గూడా మంచి పౌరుడు యథాశక్తిగ కృషి చేయును.

ఈ విధముగా ఆధునిక కాలమున సత్పౌరుని బాధ్యత లనేకములు గలవు. భూతదయా ప్రచార సంఘములు, సంఘ సంస్కరణ సమితులు, సహకార సంఘములు యిట్టివానియందు మంచి పౌరుడుచితముగ పాల్గొని తన ధర్మము నెరవేర్చును. ఇది ప్రజాస్వామిక యుగము గనుక సత్పౌరుడు ప్రజాస్వామిక నిర్వహణమునం దుత్సాహము చూపును.

### 3. సామూహిక కుటుంబము యొక్క మంచి చెడ్డలను పేర్కొనుడు.

జ. కుటుంబము సాంఘిక సంస్థలలో ముఖ్యమైనది. సామూహిక కుటుంబము, లేక ఉమ్మడి కుటుంబము అనియు, వ్యష్టికుటుంబము అనియు కుటుంబ పద్ధతులు రెండు విధములు. భార్యాభర్తలు, వారి కుమాళ్లు, కోడళ్లు, వారి పిల్లలు, పెండ్లికాని కూతుళ్ళు, వితంతువులైన తోబుట్టువులు, కుటుంబమునకు దగ్గిర బంధువులైన ఇట్టివారందరు కలిసి ఒకే యింట్లో

నివసించుచూ, ఏక భాండాశనము చేయుచూ, (ఒకే వంట) కుటుంబము నందు అందరి సంపాదనంతను కలిపి ఉమ్మడిగా ఖర్చు చేసికొనుచుండు పద్ధతికి ఉమ్మడి కుటుంబ విధానమందురు. అట్లుగాక వివాహమైనతోడనే భార్యా భర్తలు తల్లిదండ్రులనుండి విడిపోయి ప్రత్యేక కుటుంబముగా జీవించు పద్ధతికి వ్యష్టి కుటుంబ పద్ధతి యందురు. ఉమ్మడి కుటుంబ విధానము హిందూదేశములో అతి ప్రాచీన కాలమునుండి నేటివరకును అమలులో నున్నది. ఇది హిందూ సంఘపు ప్రత్యేక లక్షణమని చెప్పవచ్చును. కాని ఆధునిక దేశము లన్నిటిలోను, ఆధునిక నాగరికత ఫలితముగ హిందూ దేశములోను వ్యష్టి కుటుంబ పద్ధతి వృద్ధి చెందుచున్నది.

సామూహిక కుటుంబ పద్ధతిలో కొన్ని సౌకర్యములును, కొన్ని చిక్కులును గూడ కనపడుచున్నవి.

సంపాదన యందు హెచ్చుతగ్గులున్నను కుటుంబములోని వారందరికిని ఉమ్మడి కుటుంబములో నిశ్చింతగా జీవనోపాధి జరుగును. అనారోగ్యము ముసలితనము, అంగవైకల్యము మొదలైన దైవికమగు బాధలుగాని, స్త్రీలకు వైధవ్యముగాని తటస్థించినప్పుడు కుటుంబములోని వారిసహాయ సంపత్తులు ఉమ్మడి కుటుంబములో లభించును. ఉమ్మడి కుటుంబమున కుటుంబ పెద్దనగా తండ్రి లేక జ్యేష్ఠసోదరుని యాజమాన్యము క్రింద నడచుచుండును. అందుచే కుటుంబములోని వారందరును కట్టుబాట్లకు లోబడి పరస్పర సహకారముతోను, ఆదరాభిమానములతోను మెలగుచుందురు. ఆదాయ వ్యయములు ఉమ్మడిగా జరుగుచుండుట వలన పొదుపు ఏర్పడును. వ్యవసాయము మొదలైన కుటుంబ వ్యాపారములును పెండ్లిండ్లు, మరణకాలపు కర్మకాండ మొదలగు శుభాశుభ కార్యములు కుటుంబములో అందరి తోడ్పాటు వల్లను సౌకర్యముగా జరుగుట కవకాశ ముండును.

ఇన్ని సదుపాయము లున్నను ఉమ్మడి కుటుంబ పద్ధతి వలన కొన్ని ఇబ్బందులును కలుగుచున్నవి. సాధారణముగా ఏక కుటుంబములలో సంపాదించువారు తక్కువ మందియును, ఊరకనె భుజించువారు ఎక్కువ

మందియు నుండురు. అందువల్ల సోమరితనము సంఘమునందు వృద్ధిచెందును. కష్టపడి ఆర్జించువారికి శ్రమ యెక్కువగుచుండును. ఉమ్మడి కుటుంబములో వయస్సులోను అభిరుచులలోను అనేక భేదము లుండును. కనుక అభిప్రాయము లేర్పడు చుండును. అందుకు ఫలితముగా మనస్పర్థలు పెరుగు చుండును. ఉమ్మడి కుటుంబ పద్ధతి వ్యక్తి స్వేచ్ఛకు భంగము కలిగించు చుండును. ఒకరి యిష్టము ననుసరించి మిగిలిన వారందరును మెలగవలసి వచ్చుట అనేకములగు అనర్థములకు దారి తీయును. ముఖ్యముగా స్త్రీల స్వాతంత్ర్యమునకు ఏకకుటుంబపద్ధతి ఆటంకముగానుండుటవలన ఈర్ష్యలు పెరుగును. అందుచే కుటుంబ సౌఖ్య ముండదు. ఉమ్మడి కుటుంబ పద్ధతిలో వ్యక్తుల ధైర్య సాహసములు వృద్ధియగుటకును, శక్తి సామర్థ్యములం బాగుగా వికసించుటకు అవకాశములు తక్కువగా నుండును.

ఉమ్మడి కుటుంబ పద్ధతి వ్యవసాయము ప్రధాన వృత్తిగా నుండిన ప్రాచీన సాంఘికవిధానమునకనుకూలించినను, వ్యక్తి స్వాతంత్ర్యము ముఖ్యాదర్శముగాగల నేడు పారిశ్రామికముగ మనకనువైనది కాదని అనుభవము వలన స్పష్టమగుచున్నది.

## 4. సంయుక్త రాజ్యాంగము యొక్క లక్షణములు వివరింపుడు.

జ. వివిధ దేశములలోని ప్రభుత్వములు రెండు తరగతులుగ విభజింప వచ్చును. (1) కేంద్రాధికార ప్రభుత్వము (Unitary Government) (2) సమాఖ్య ప్రభుత్వము (Federal Government) కొన్ని రాజ్యములలో పరిపాలనాధికారము లన్నియు కేంద్ర ప్రభుత్వమునకే చెంది యుండును. దేశమున కంతటికిని ఒకే విధమైన శాసనములు వర్తించును. రాష్ట్రములకును స్థానిక ప్రభుత్వ సంస్థలకును కొన్ని అధికారములున్నను అవి కేంద్ర ప్రభుత్వము ద్వారానే సంక్రమించును. కేంద్ర ప్రభుత్వము తరపుననే అవి అమలు జరుపబడును. అవసరమని తోచినపుడు కేంద్ర ప్రభుత్వ మాయధికారమును తొలగింపవచ్చును. ఇంగ్లండు, ఫ్రాన్సు మొద

లైనవి (Unitary Government) ఉదాహరణములు. ఈ దేశములలో పార్లమెంటు చట్టములు దేశమున కంతటికిని ఒకే విధముగ వర్తించును.

సంయుక్త రాజ్యాంగములో చేరగోరు వివిధరాష్ట్రముల సమ్మేళనమునకు (Federation) లేక సమాఖ్య అని పేరు. వివిధ రాష్ట్రములు కలసి ఒక సమ్మేళనముగా నేర్పడుటకు నిశ్చయించుకొన్నప్పుడే సంయుక్త రాజ్యాంగ మేర్పడును. సమాఖ్య ప్రభుత్వ విధానములో పరిపాలనాధికారములు కేంద్ర ప్రభుత్వమునకును రాష్ట్ర ప్రభుత్వములకును విభజింపబడును. వీనికి కేంద్రాధికారములు, రాష్ట్రాధికారములు అని పేరు. కొన్ని విషయములలో కేంద్ర ప్రభుత్వమునకును, రాష్ట్ర ప్రభుత్వములకునుగూడ చెందును ఇవి (Concurrent Powers) అనబడును. ఈ యధికారము లన్నియు ఒక (Written Constitution) (లిఖిత రాజ్యాంగ ప్రణాళిక) లో నిర్దేశింపబడి యుండును. ఇవేవిధముగను నిర్దిష్టముకాని అధికారములు (Residuary Powers) (పరిశిష్టాధికారములు) అనబడును. ఇవి కొన్ని దేశములలో కేంద్రమునకును (ఉదాహరణ :- భారత దేశము కొన్నింటిలో రాష్ట్రములకు అమెరికా సంయుక్త రాష్ట్రములు (U. S. A.) ఈయబడి యున్నవి. కేంద్ర ప్రభుత్వము రాష్ట్రాధికారములలో గాని, రాష్ట్రములు కేంద్రాధికారములలో గాని జోక్యము కల్గించుకోరాదు. ఈ సందర్భములో కలుగు తగాదాలు (Supreme Court) పరిష్కరించును.

జాతీయ భావమునకును, స్థానికాభిమానమునకును సమన్వయము కలిగించుట సంయుక్త రాజ్యాంగముయొక్క ప్రధానోద్దేశము.

5. ఆస్తి హక్కు పౌరున కేరీతిగ అవసరము? మన దేశమున ఆస్తి హక్కుపై విధింపబడిన పరిమితు లేవి?

ఒక వ్యక్తికి సంపూర్ణమైన యాజమాన్యమును ఉపయోగించుకొనుటలో పూర్తియైన స్వేచ్ఛ యున్న గల వస్తు సముదాయమునకు ఆస్తి యని పేరు. స్థిరాస్తి యనియు, చరాస్తి యనియు ఆస్తి రెండు విధములు. ఇండ్లు

భూములు మొదలైనవి స్థిరాస్తి యనబడును. ధనము, ఆభరణములు, వస్త్రములు, వాహనములు, గృహపరికరములు మొదలైనవి చరాస్తిలో చేరును. చరాస్తి విషయమున వ్యక్తులకు ప్రాచీనకాలమునుండియు సంపూర్ణమైన హక్కు గుర్తింపబడినది. కాని స్థిరాస్తి విషయమై దేశమును బట్టియు, కాలమును బట్టియు మార్పులు కలుగుచున్నవి. చాల ప్రాచీన కాలమున భూమియందు సంఘమునకు ఉమ్మడి హక్కు ఉండెను. మధ్యయుగమున భూమి కంతటికి రాజు సర్వాధికారి యను సిద్ధాంత మేర్పడెను. ఆ పిమ్మట జమీందార్లకు భూములయందు హక్కు గలదను సూత్ర మమలు జరిగెను. కాని నేడు దున్నినవానికే నేలయందు హక్కు గలదను పద్ధతి ప్రజామోదము బొందుచున్నది.

వ్యక్తికి ఆస్తియందు హక్కుండవలెనను సూత్రము సాధారణముగ అన్నిదేశములందును అనుసరింపబడుచున్నది. అందుచేతనే పౌరుల ఆస్తి హక్కును అన్ని ప్రభుత్వములు కాపాడుచున్నవి. వ్యక్తులు తమ ఆస్తిని స్వేచ్ఛగా వాడుకొనుటకును అన్యాక్రాంతము చేయుటకును గూడ గల హక్కును ప్రభుత్వ శాసనములు గుర్తించుచున్నవి. అంతేగాక పౌరులకు ఆస్తియందు గల హక్కు మూలభూత హక్కులలో చేర్చి (Fundamental Rights) భారత రాజ్యాంగచట్టమున ఉదహరింపబడియున్నవి.

పౌరులకు ఆస్తియందు హక్కు కలిగియుండుట అనేక విధముల అవసరమై యున్నది. తమ ఆస్తిని తాము స్వేచ్ఛగా వాడుకొనుటకు హక్కు ఉన్న పరిస్థితులలో పౌరులు కష్టపడి పనిచేసి ఆస్తిని పెంపొందించుకొందురు, లేనిచో సోమరితనము ప్రబలును. ఆస్తిని సముపార్జించి కాపాడుకొనుట అను విధానము వలన మానవుల శక్తి సామర్థ్యములు వికసించుటకును, ధైర్యోత్సాహములు ప్రబలుటకును అవకాశము గలదు. ఆస్తి హక్కు ననుభవించుట మానవుల కొక సంతృప్తిని కల్గించును. 'మనిషికి ఉన్నది పుష్టి, గొడ్డుకు తిన్నది పుష్టి' — అను సామెత. అందుచేతనే

ప్రచారములో నున్నది. ధనము వలన ఎన్ని నష్టములో గలవని ఎందరో చెప్పుచున్నను సంఘమునందు హిరణ్యవృద్ధులకే విలువ యుండును. ఆస్తి సంపాదన చేసి తాను తమ వారోదాను పెంపొందము చేసికొనవలెనను వ్యక్తుల కృషి జాతీయ సంపద పెరుగుటకు పునాది నేర్పరచును. ఎక్కువ ఆస్తిగల వ్యక్తులు కొందరు ఉదారబుద్ధితో దేవాలయములు విద్యాశాలలు వైద్యశాలలు మొదలగు ధర్మ సంస్థలకు తోడ్పడి సంఘ క్షేమమును వృద్ధి చేయుచున్నారు.

కాని వ్యక్తిపరమగు ఆస్తి హక్కు ఒకవిధముగా నష్టకరమను వాదము సోషలిజం (Socialism) సిద్ధాంతముల వలన ప్రబలుచున్నది. కొద్దిమంది చేతులలో విపరీతమగు ఆస్తి యుండుట సంఘమున కనర్థకరమను అభిప్రాయము వ్యాపించుచున్నది. హిందూదేశమున పూర్వకాలమునుండియు పురుషులకే గాని స్త్రీలకు ఆస్తి హక్కు లేదు. ఇప్పుడిప్పుడు ఈ విషయములో కొంత మార్పు కలిగి స్త్రీలకుకూడ ఆస్తి హక్కునకవకాశము కలిగింపబడుచున్నది. అంతేగాక భూసంస్కరణ శాసనములు చేసి వ్యక్తుల గరిష్టభూవసతి నిర్ణయించుటకు యత్నించుచున్నారు. వ్యాపారస్థుల లాభములో ఆదాయపు పన్నులో (Super Tax) వేసి వ్యక్తుల విపరీతాదాయమును తగ్గించుచున్నారు. ఇంగ్లండు మొదలగు దేశములలో వలె (Death Duties) మూలమునకు వ్యక్తుల ఆస్తి హక్కులో నియమము లేర్పడుచున్నవి.

**6. ప్రజాప్రభుత్వ మన నేమి? ప్రజాప్రభుత్వ సాఫల్యమునకు ఆధారము లేవి?**

జ. జనసామాన్యము యొక్క అభీష్టము ననుసరించి పరిపాలన జరుపు ప్రభుత్వ విధానమునకు ప్రజాస్వామిక ప్రభుత్వము (Democracy) అని పేరు. ప్రజాశ్రేయస్సు కొరకు ప్రజలచే నడుపబడుచు ప్రజలకు చెందిన ప్రభుత్వము ప్రజాప్రభుత్వ మనబడును. (Government of the people

by the people, for the people) అని సుప్రసిద్ధ రాజ్యాంగవేత్త యగు అబ్రహాంలింకన్ ప్రజాప్రభుత్వమును నిర్వచించి యున్నాడు. పరిపాలనాధికారము ప్రత్యక్షముగ గాని పరోక్షముగ గాని ప్రజల హస్తగతమైయుండుట ప్రజాస్వామికము యొక్క ముఖ్యలక్షణము. అంతేగాక ప్రజాస్వామికమునందు ప్రజాభిప్రాయమే సర్వస్వతంత్రమైనదిగా నుండును. పౌరుల స్వేచ్ఛ, సమానత్వము అనునవి ప్రజాప్రభుత్వమునకు మూలసూత్రములు. ప్రభుత్వమునందు పౌరులందరికిని సమానభాగము సమానావకాశములును ఉండుట ప్రజాస్వామికము యొక్క ముఖ్యలక్షణమై యున్నది. ఇట్టి సమానత్వము స్థాపించుటకు పరిపాలనాచక్రమును నడుపు అధికారము ప్రజలవశమున నుండును. ఇట్టి అధికారమును పౌరులు తమకు గల వోటుహక్కుమూలమున వ్యక్తపరచెదరు. పరిపాలనను నడుపుటకును, శాసనములు చేయుటకును తమ తరపున ప్రతినిధులను ప్రజలు వోటుమూలమున ఎన్నుకొందురు. ఇట్లు ఎన్నుకొనబడినవారు శాసన సభ్యులుగను, మంత్రివర్గముగను ఏర్పడి ప్రజాస్వామికమును నడపింతురు.

ప్రజాస్వామికము సాఫల్యమగుటకు కొన్ని అంశములు మూలాధారములైయున్నవి. మొట్టమొదటి అంశమేమనగా పౌరులు తమ వోటు హక్కును సక్రమముగా వినియోగించవలెను. అనగా సరియైన ప్రతినిధుల నెన్నుకొనవలెను. అనగా సమర్థులైన ప్రతినిధులను నిష్పక్షపాతముగను, న్యాయముగను ఎన్నుకొనవలెను. అందుకు పౌరులు తమహక్కులను విధులను గుర్తెరింగి వాటిని క్రమముగా అమలుజరుపవలసి యుండును. ఇట్టి శక్తిసామర్థ్యములు పౌరులకు కలుగుటకు తగిన రాజకీయపరిజ్ఞానమవసరము. అట్టి పరిజ్ఞానమునపొందుటకై పౌరులు పౌరనీతిసూత్రము నవగాహనచేసికొని ఆచరించుటకు సంసిద్ధులైయుండవలెను. పౌరులు తమకు గల బాధ్యతలను సక్రమముగ గుర్తించుట అవసరము. పౌరులు తగిన పరిజ్ఞానము లేక బాధ్యతారహితముగా ప్రవర్తించినచో ప్రజాస్వామికము అనర్థహేతువగును. రాజకీయ సమస్యలను వివేచనాశక్తితో పరిశీలించి

పరిష్కారము చేసికొనగల సామర్థ్యము పొరులకున్నపుడే ఏ ప్రజాస్వామిక మైనను జయప్రదముకాగల్గును. ప్రజాస్వామిక విధానములో ప్రజలు నిర్వహింపవలసిన మంత్రిపదవులు మొదలగునవి ప్రజాహితదృష్టితో స్వార్థపరత్వము లేకుండ జాతీయక్షేమమే ప్రధానలక్షణముగా పౌరులు పెట్టుకొన్నప్పుడు ప్రజాస్వామికము సుఖప్రదమగును.

## 7. ప్రజాప్రభుత్వమునకు స్థానిక పరిపాలన ఎట్లు తోడ్పడగలదు ?

జ. ఒక రాజ్యమునందలి భాగమైన ఒక ప్రాంతముయొక్క పరిపాలనకు సంబంధించిన కొన్ని అంశములు ఆ స్థానిక ప్రజల ప్రతినిధులచే నడుపబడు పరిపాలనా విధానమునకు స్థానిక పరిపాలనమని పేరు. ఒక రాజ్యముయొక్క ప్రభుత్వము ఆ రాజ్యమునకు చెందిన పరిపాలనాంశముల నన్నిటిని నిర్వహించుట కష్టసాధ్యము కావచ్చును. అట్టి సందర్భములలో స్థానిక ప్రజాప్రతినిధులచే అంశములు నిర్వహింపబడుటకు వీలుగా కొన్ని సంస్థలు ఏర్పరుప బడినవి. జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయతీ బోర్డులు, కార్పొరేషనులు-ఇవి ముఖ్యమైన స్థానికపరిపాలనా సంస్థలై యున్నవి.

ప్రజాప్రభుత్వము జయప్రదమగుటకు స్థానిక పరిపాలన అనేక విధముల తోడ్పడును. ప్రజాప్రభుత్వము ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులచే నడుపబడును. ఆ ప్రతినిధులకు రాజ్యపరిపాలనలో తగిన అనుభవము గల్గుటకు ముందు వారు స్థానిక సంస్థల నిర్వహణములో తగిన తరిఫీదు పొందుట ఎక్కువ ప్రయోజనకారిగా నుండును. స్థానిక సంస్థలలో పాల్గొనుట వలన ప్రజాప్రతినిధులకు తగిన నేర్పును ఉత్సాహమును కల్గును. ఆ పిమ్మట వారు దేశపు మొత్తమునకు చెందిన శాసన నిర్మాణ సభలలోను, మంత్రి వర్గములోను సామర్థ్యముతో భాగస్వాములు కాగలరు. అంతేగాక వారు స్థానిక సంస్థలలో నెరవేర్చిన కార్యముల మంచిచెడ్డలను బట్టియు,

పారపాట్లను బట్టియు దేశపరిపాలనను నడుపుటలో తగిన అనుభవమును బాధ్యతను పొందగలరు. చిన్న ప్రాంతములగు గ్రామములు, పట్టణములు, జిల్లాలు మున్నగు వానిలో జరుగు ఎన్నికలు (Elections) ప్రజా సామాన్యమునందు రాజకీయ పరిజ్ఞానము పెంపొందించుటకు విశేషముగ తోడ్పడును. స్థానిక సంస్థలలో ఆదాయ వ్యయ పట్టిక (Budget) సిద్ధపరచుట, ఆదాయమార్గములు (పన్నులు మొదలైనవి) అన్వేషించుట ఇట్టి అంశములలో అనుభవము దేశపరిపాలనలో ప్రజాప్రతినిధులకు విశేషముగ తోడ్పడగలదు. దేశపరిపాలనా విషయమున ప్రభుత్వమునకుగల కష్టనిష్ఠూరములను గ్రహించుటకును స్థానిక సంస్థలు సహకారులగుచున్నవి. స్థానిక సంస్థలు కట్టుదిట్టముగా పరిపాలన నడిపి ఏ ప్రాంతము కాప్రాంతమువ ప్రజల శ్రేయస్సు పురోగమించుచున్నచో దేశసౌభాగ్యము వృద్ధిజెందుటలో ఎట్టి సంశయము నుండదు.

కనుక స్థానిక పరిపాలన ప్రజాప్రభుత్వ విజయమునకు పునాదియని చెప్పవలసియున్నది.

## 8. బాధ్యతాయుత ప్రభుత్వమునందు మంత్రి పరిషత్తునకును, ప్రజాప్రతినిధి సభకును గల సంబంధమును వివరింపుడు.

జ. ప్రభుత్వ విధానములు రెండు తరగతులుగ విభజింపబడుచున్నవి. (1) బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Government) లేక మంత్రివర్గ పరిపాలన (Cabinet Government).

(2) అధ్యక్ష పరిపాలన (Presidential Government) వీనిలో బాధ్యతాయుత ప్రభుత్వ విధానమునందు మంత్రివర్గమునకును (Cabinet) ప్రజాప్రతినిధి సభకును (Legislature) సన్నిహిత సంబంధ ముండును. బాధ్యతాయుత ప్రభుత్వములో శాసనసభ యందలి అధికసంఖ్యాక పక్షము (Majority Party) పరిపాలనను నడుపుట సంప్రదాయమై యున్నది. ప్రజాప్రతినిధి సభలకు ఎన్నికలు ముగియగానే ఏ రాజకీయ పక్షమునకు

చెందినవారు అధిక సంఖ్యాకులుగా ఎన్నుకొనబడుదురో ఆ పార్టీ నాయకుడు మంత్రివర్గము (Cabinet) ఏర్పరచుటకు ఆహ్వానింపబడును. ఆ విధముగ ఏర్పడిన మంత్రివర్గము శాసన సభలో అధిక సంఖ్యాకుల ఆమోదము ఉన్నంతకాలమే అధికారమునందుండును. శాసన సభలో విశ్వాసరాహిత్య తీర్మానము నెగ్గినచో మంత్రివర్గము రాజీనామా చేయవలసి యుండును. బాధ్యతాయుత ప్రభుత్వమునందు మంత్రివర్గము ప్రజాప్రతినిధి సభలలో నిర్ణయింపబడిన రాజకీయ విధానముల నమలు జరపుచు శాసన నిర్మాణ సభలకు కార్యనిర్వాహక వర్గముగా పనిచేయుచుండును. ఈ విధముగా మంత్రివర్గము ప్రజాప్రతినిధి సభలకును తద్వారా నియోజక వర్గమునకును (Electorate) బాధ్యత వహించును. బాధ్యతాయుత ప్రభుత్వమున మంత్రి వర్గ సభ్యులు (Ministers) ప్రజాప్రతినిధి సభలలో (Parliament) సభ్యులుగా నుందురు. అందుచేతనే ఈ విధానమునకు (Parliamentary Government) అని కూడ పేరు గలదు. పార్లమెంటు సభ్యులడిగిన ప్రశ్నలకు మంత్రివర్గ సభ్యులు తగిన సమాధానము లీయవలసియుండును. (Interpellations).

(Presidential Government లో మంత్రివర్గ సభ్యులు (President) చే నియమింపబడి (President) కే బాధ్యత వహించి యుందురు.

ఇండియన్ యూనియన్, ఇంగ్లండు ప్రభుత్వములు బాధ్యతాయుత ప్రభుత్వ విధానమున కుదాహరణములు.

9. వర్ణవ్యవస్థనుగూర్చిన వాద ప్రతివాదములను సంక్షిప్తముగ దెల్పుము.

జ. వర్ణవ్యవస్థ హిందూదేశపు చరిత్ర ననుసరించి యేర్పడిన ప్రాచీన సంస్థయై యున్నది. సుమారు మూడువేల యేండ్ల క్రిందట ఆర్యులు మన దేశమున స్థిరనివాసము నేర్పరచుకొని సంఘమును కట్టుదిట్టముచేసికొన్న

చుండిన కాలములో వర్ణవ్యవస్థ ఆరంభమైనది. పై దేశమునుండి వచ్చిన ఆర్యులకును దేశములోని ఆదిమవాసులకును కొంతకాలము పోరాటము జరుగుచుండెడిది. అందుచే అనార్యులతో యుద్ధములు చేసి ఓడించి వారి నుండి కాపాడి ప్రజలలో శాంతి సంరక్షింప వలసిన బాధ్యత కొందరు వహించిరి. ఇట్టివారు క్షత్రియులు. విద్యాప్రచారము చేసి కర్మకాండ నడుపువారు బ్రాహ్మణులైరి. వ్యవసాయము, వ్యాపారము జరుపువారు వైశ్యులైరి. మిగిలినవారు శూద్రులు. కాలక్రమేణ ఈ నాలుగు వర్ణములమధ్య వివాహ సంబంధములలోను, భోజనాదులలోను నిర్బంధము లేర్పడెను. మొదట ఈ వర్ణవిభాగము సంఘక్షేమము ననుసరించి శ్రమ విభాగము (Division of Labour) సంప్రదాయములను సంరక్షించుట, వృత్తి విద్య అభ్యసించుట— మొదలగు మంచి సూత్రములపైననే ఆధారపడియుండెను. భారతదేశపు సంస్కృతిని (Culture) కాపాడుటలో వర్ణవ్యవస్థ ఎక్కువగా తోడ్పడినది సంఘమునందు నిరుద్యోగము లేకుండుటకును ఆర్థిక సంపద పెంపొందుటకును వర్ణవిభాగము ఎక్కువగా ఉపకరించినది.

వర్ణవ్యవస్థ ఇన్ని విధములుగా హిందూదేశమున ఉపకరించినను కొన్ని విధములచేత అది మనకు కాలక్రమేణ అనర్థకరముగా పరిణమించినది. వివిధ వర్ణములమధ్య వివాహాది విషయములలో ఏర్పడిన కట్టుదిట్టములు కొన్ని వర్ణములు ఎక్కువ, మరికొన్ని తక్కువ అనుభావమునకు దారితీసి హిందూ సంఘములో సంఘీభావము లోపింపజేసినది. మొదట నుండిన నాల్గు వర్ణములు కాలక్రమేణ వందలకొలది కులములుగా మార్పుజెంది హిందూ సంఘమున చీలిక లేర్పడినది. హెచ్చుతగ్గులను భేదభావములు ఈర్ష్యకు కారణమై దేశమును విదేశీయుల పరిపాలనకు లోనుచేసినది. జాతీయ భావము పెంపొందుటకు నేటి కాలమున వర్ణవ్యవస్థ కొంతవర కాటంకముగ నున్నది. వ్యక్తి స్వాతంత్ర్యము, సమానత్వము మున్నగు సూత్రములకు ప్రాధాన్యముగల నేటి ప్రజాస్వామిక యుగములో వర్ణవ్యవస్థకు స్థానము లేదని చాల మంచి యభిప్రాయమై యున్నది.

10. ప్ర. స్వదేశాభిమానము యొక్క మంచి చెడ్డలు వివరింపుడు.

జ. మానవునకు తాను జన్మించిన ప్రదేశమున ఎడలను సంఘము ఎడలనుగల అభిమానమునకు స్వదేశాభిమానము (Patriotism) అనిపేరు. తాను పుట్టినచోటునందలి ఆదరము మనుష్యులందరకును తుదకు నోరెరుగని జంతువులకుగూడ సహజగుణము. అందుచేతనే జననీజన్మభూమిశ్చస్వర్గాదపిగరీయసీ అను అర్యోక్తిపుట్టినది. దేశభక్తిలేనివాడు పాపాత్ముడని చాలమంది కవులు వర్ణించియున్నారు. అందుచే స్వదేశాభిమానము మానవుని ఉత్తమగుణములలో నొకటియనుట నిర్వివాదాంశము.

స్వదేశముపై అభిమానము మానవులలో ఉత్తమాదర్శములను రేకెత్తించును. త్యాగము, ధర్మము, దానము, సహకారభావము, ఆదరము ఇట్టి గుణములు దేశాభిమానము మనకు పెంపొందును. దేశస్వాతంత్ర్యము కొరకు తమ సర్వస్వమును తుదకు ప్రాణములనుగూడ అర్పించిన త్యాగశాలురెందరో గలరు. ప్రపంచమందలి అన్నిదేశముల చరిత్రలలోను ఇట్టి త్యాగశీలత కెన్నియో నిదర్శనములు చూపవచ్చును. తమ దేశాభివృద్ధికై ఎన్నియో దానధర్మములుచేసిన మహనీయులు అనేకులుగలరు. దేశస్వాతంత్ర్య సంపాదనకైజరిగిన పోరాటములలో సహకారభావముతో నాయకుల ఆజ్ఞలను శిరసావహించిన వారునుగలరు. ఏ దేశమునకైనను విద్య, కళలు, పరిశ్రమలు మున్నగునవి వృద్ధిపొందుట కచటివారలు నిష్కళంక దేశాభిమానమే మూలకారణము.

స్వదేశాభిమానము ఈ విధముగ అనేక సుగుణములు పెంపొందుటకు హేతువైనను దేశభక్తియనునది తప్పుత్రోవను బట్టినచో దానివలన ఎన్నియో చెడుగులు ఏర్పడును. విపరీతమగు స్థానికాభిమానమువలన సంకుచితభావము లేర్పడును. ఈర్ష్యలు వృద్ధియగును. ప్రపంచయుద్ధములకు ఇట్టి విపరీత దేశాభిమానమే కారణమగుచున్నది. దేశాభిమానము మరియొక

అనర్థమునకు దారితీయుట. సర్వసాధారణ విషయముగా నున్నది. స్వదేశాభిమానమను పేరుతో కొందరు తమ దేశమునకు చెందినదంతయు గొప్పదనియు. విదేశములకు చెందినదంతయు నీచమనియు భావింతురు. ఇవి కేవలము జాత్యహంకారమనిపించు కొనును. కనుక వాస్తవమగు దేశాభిమానులు ఇట్టి అహంకారమునకు లోనుకారాదు. మరియొక ముఖ్యవిషయమేమన దేశభక్తులమని నటించి కొందరు స్వలాభమును పెంపొందించుకొందురు. ఇట్టి స్వార్థపరాయణత్వము నిజమైన దేశాభిమాన మనిపించుకొనదు.

విశ్వమానవభావము (Internationalism) వ్యాపించి మానవజాతియంతయు ఒకే కుటుంబముగ పరిగణింపబడుచున్న నేటికాలమున సంకుచిత దేశాభిమానమునకు తావులేదు. కాని ప్రతిపౌరుడును విశాలభావముతో స్వదేశాభివృద్ధిని ప్రధానాదర్శముగ నుంచుకొనుట ముఖ్యధర్మము.

# MATRICULATION EXAMINATION 1959
## SEPTEMBER
## CIVICS

(Answer any five questions. All questions carry equal marks)

1. పౌరశాస్త్ర మనగా నేమి? పౌరశాస్త్రము అభ్యసించుట వలన లాభమేమి?

జ. 'సివిక్స్' అనునది సివిస్ అను లాటిన్ పదమునుండి పుట్టినది. సివిస్ అనగా పౌరుడు అని యర్థము. అందుచేత సివిక్స్ అనగా పౌరుని కార్యకలాపములను వర్ణించు శాస్త్రమని నిర్వచింపవచ్చును. ఈ శాస్త్రములో పౌరుని హక్కులను విధులనుగూర్చి తెలిసికొందము. అంతేగాక పౌరసత్వ విషయములుగూడ ఈ శాస్త్రమువలన తెలిసికొననగును. పౌరుని రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మత సాంస్కృతిక విషయములుగూడ సివిక్స్ నందు చర్చింపబడును. పౌరుని కార్యకలాపములు నెరవేర్చుకొనుటకవసర మగు సంస్థలను గూర్చియు సివిక్స్ తెలుపును.

మానవజాతి అభివృద్ధికి సివిక్స్ లేక పౌరవిజ్ఞానము నందలి అంశములు గ్రహించుట ప్రతి పౌరునకును అత్యవసరము. పౌరజీవితమును సక్రమముగా నెరవేర్చుటలో పౌరశాస్త్రమునకు గల స్థానము ప్రధానమైనది. సాంఘిక పరిస్థితులను సంస్కరించుకొనుటకు అవసరమైన విషయములు పౌరశాస్త్రము వలన తెలిసికొనుటకు వీలగును. పౌరుడు సంఘమున మెలగవలసిన రీతులు సివిక్స్ వలన స్పష్టమగును.

ప్రతి పౌరుడును, తన విషయమునను తన తోడిమానవుల యెడలను ఎట్లు ప్రవర్తింపవలెనో తన కుటుంబము, తన గ్రామము, తనదేశము, తన ప్రపంచము—మున్నగు వివిధస్థాయిలలోనే యేవిధములుగా ప్రయోజనకారియైన విధమున సంచరింపవలెనో పౌరవిజ్ఞానము తెల్పును.

ఇది ప్రజాస్వామిక యుగమగుటచే ప్రతి పౌరునకును ప్రభుత్వమును నడపుటలో భాగమున్నది. కనుక పౌరులందరును తమ విధులను హక్కులను గుర్తించి వాటిని సమన్వయ పరచుకొని సంఘశ్రేయస్సునకును, జాతి శ్రేయస్సునకును, మానవజాతి శ్రేయస్సునకును వినియోగింపవలెను. పౌరులందరును ప్రజాహిత సంస్థలలో పాల్గొనవలెను. దీని కంతటికిని సివిక్సు మూలము గనుక ఆధునిక కాలపు జీవితములో ఈ శాస్త్రమునకు మిక్కిలి ప్రాధాన్యము గలదు.

2. హక్కులు అనగా నేమి? ఇండియా సంవిధానములోని మూలాధికారముల అర్థమును వివరించునది.

జ. పౌరులకు గల ప్రత్యేకాధికారములు ప్రభుత్వముచే గుర్తింపబడి శాసనముచే సంరక్షింపబడినపుడు అవి 'హక్కులు' అను పేరు పొందును. ఉదాహరణకు ఒక వ్యక్తికి తన ఆస్తియందు ప్రత్యేకాధికారము గలదు. ఇతరులు అతని ఆస్తి కనుభవమునకు భంగము కలిగించకుండ ప్రభుత్వము సంరక్షించును. ఇతరులవలన తన ఆస్తికి భంగము కలిగినపుడు న్యాయస్థానముద్వారా తనహక్కులను నిలబెట్టుకొనుటకు ప్రతివ్యక్తికి పావకాశము గలదు. ఆస్తిహక్కు, వోటింగుహక్కు మొదలైన హక్కులు ప్రతి పౌరునకును గలవు. హక్కులకుగల ఒక ముఖ్యలక్షణ మేమనగా అవి కాలానుగుణముగా మారుచుండును. ఉదాహరణ మేమనగా కొంత కాలము క్రిందటివరకును ప్రతివ్యక్తికి తన ఆస్తియందుల సంపూర్ణాధికారము లుండెడివి. కాని ప్రస్తుత కాలమున అందుకు కొన్ని హద్దు లేర్పరుప బడినవి. అట్లే ఇదివరలో వోటరులకు కొన్ని ప్రత్యేకార్హత లుండెను. కాని నేడు భారతదేశమున వయోజనులందరికిని వోటింగుహక్కు గలదు.

స్వతంత్ర భారతదేశములో పౌరులందరకును కొన్ని హక్కుల నొసగుచు రాజ్యాంగ చట్టమున అవి ఉదహరింపబడియున్నవి. వానికి మూలభూతహక్కులు (Fundamental Rights) అని పేరు. వీనిలో

ముఖ్యమైన తేడనగా జాతి, మత, కుల, లింగభేదములతో నిమిత్తము లేకుండ భారతపౌరులందరియెడలను చట్టములు సమానముగా వర్తించును. ఉద్యోగము లిచ్చుటలోను, కళాశాలలలో చేర్చుకొనుటయందును విద్యా యోగ్యతయే పరిగణింపవలెను. గాని ఎట్టి వివక్షత కూడ చూపరాదు. చెరువులు, బావులు, రస్తాలు, సినిమాలు, హోటళ్ళు, రైళ్ళు మొదలగు బహిరంగ స్థలముల ఉపయోగములో వివక్షత చూపరాదు. అస్పృశ్యత పాటించుట నేరము. దేవాలయములలో పూజచేయుట కితరులతోపాటు హరిజనులకును హక్కుగలదు. ప్రతివ్యక్తియు స్వశక్తిచే జీవితమున పూర్తి అవకాశముల వినియోగించుకొని పురోభివృద్ధికి వచ్చుట కాటంకముండరాదు.

హక్కులు వ్యక్తియొక్క పూర్తి వికాసమునకు తోడ్పడును. మూలభూత హక్కులకు రాజ్యాంగచట్టము ద్వారా హామీ యిచ్చుట భారతదేశమున విలక్షణ విషయము.

3. మన దేశపు పౌరులు ఆదర్శప్రాయులా? ఉత్తరమునకు కారణము లొసగునది.

జ. ఆదర్శప్రాయులగు పౌరులనగా తమ విధులను హక్కులను బాగుగ గుర్తించి వాటిని సక్రమముగ సమన్వయపరచుకొని అమలు జరుపుటకు శక్తిగల పౌరులు అని యర్థము. రైళ్ళు, సినిమాలు మొదలైన బహిరంగ స్థలములలో క్రమప్రవర్తన కలిగియుండుట, శాసనముల యెడల విధేయత, పన్నులు చెల్లించుటలో శ్రద్ధ-ఇట్టివి పౌరుల విధులు. తమ పురోభివృద్ధికిగల అవకాశములను న్యాయమార్గమున యత్నించుట, తమ అభిప్రాయములను నిర్భయముగా వెల్లడించుట వోటింగు క్రమవినియోగము—ఇట్టివి పౌరుల హక్కులు.

పై విషయములు మనదేశపు పౌరులు ఎంతవరకు అవగాహన చేసికొని ఎంతవరకు ఆచరించుచున్నారో పరిశీలించినపుడు మన పరిస్థితు లెంత అధ్వాన్నముగ నున్నవో స్పష్టముకాగలదు. రైలు స్టేషనులు, సినిమా

హాలులు మొదలైన స్థలములయందు టిక్కెట్లు తీసికొను సమయమున మన దేశీయులు ఎంత విద్యాధికులైనను త్రోపులాట, అందరికంటె ముందుగా తాము టిక్కెట్టు తీసికొనవలెనను ఆతురతను చూపెదరుగాని క్యూ (Que) పద్ధతిలో నిలచినచో అందరికిని సులభమను అంశము తెలిసికొనరు. తెలిసియుండి ఆచరింపరు. రైళ్ళు, వీధులు మున్నగుచోట్లు బుద్ధిపూర్వకముగా అపరిశుభ్రము చేయుదురు. సభలలో శాంతముగా మెలగుటయును జరుగదు. కళాశాలా విద్యార్థులె రైళ్ళలో లైట్లు. ఫానులు పాడుచేయుదురు.

ఇక హక్కుల విషయము చూచినను నిస్వార్థబుద్ధితో వోటునిచ్చుట, ప్రజాహిత సంస్థలలో పాల్గొనుట వ్యాపారసరళి - నైతికధైర్యము మున్నగు అలవాట్లు చాల తక్కువ.

పౌరస్వత్వ విషయమున మన పౌరుల అధ్వాన్నస్థితికి ముఖ్యముగా చిరకాలము మనదేశ పారతంత్ర్యమును, ప్రభుత్వపు అశ్రద్ధయు కారణములు. ఇంగ్లండు, అమెరికావంటి ఆధునిక దేశములలోని పౌరులు ఈ విషయమున చాల శ్రద్ధవహింతురు. మనదేశమున పౌరులు తమ ధర్మ నిర్వహణలో స్వల్పవిషయములందును పెద్ద విషయములలోను చాల ఎక్కువ శ్రద్ధవహించుట అవసరము. ఈ విషయమున మనదేశమందాదర్శ స్థితి ఏర్పడుటకు చాలకాలము పట్టును.

4. కుటుంబ జీవనము పౌరత్వమున కేరీతిగ సహాయపడ గలదు?

జ. పౌరత్వమునకు వివిధములగు హక్కులును, విధులును సంబంధించి యున్నవి. ఇవి యన్నియు గ్రహించి సక్రమముగా అమలు జరుపుటకు ప్రతి పౌరునకును కొంత తరఫీదు అవసరము. అట్టి తరఫీదు పొందుటకు పౌరునకు అనేకావకాశము లున్నవి. వానిలో కుటుంబ జీవితము పౌరత్వమునకు అలవడుట కొక ముఖ్య సాధనమనుట నిస్సంశయము.

ప్రతి పౌరుడును తన బాల్యజీవితమును కుటుంబమునందే గడపును.

కుటుంబమునందు తలిదండ్రులు, అన్నతమ్ములు, అక్కచెల్లెండ్రు, ఇతరులగు దగ్గిర బంధువులు నుందురు. ఈ విధముగా కుటుంబమొక చిన్న రాజ్యము వంటిదని చెప్పదగును. కుటుంబ పెద్దలగు తలిదండ్రుల ఆజ్ఞలకు పిల్లలు బద్ధులై వినయవిధేయత కల్గియుండుట అవసరము. అన్నదమ్ములతో సహకరించి కుటుంబపు పనులు నెరవేర్చుట అందరకును సహజకార్యక్రమమై యుండును. అక్కచెల్లెండ్రు యందు ఆదరము, ప్రేమ సహజముగా కల్గును. మిగిలిన సన్నిహిత బంధువులయెడల ఆప్యాయత ఏర్పడును.

కుటుంబ వ్యవహారములు నిర్వహించుటలో మితవ్యయము, కష్టపడి పనిచేయుట మొదలైన గుణము లలవడును. ఒక్కొక్కపుడు కుటుంబ యాజమాన్యము వహించి అందరును సక్రమమార్గమున నడపింపవలసిన అవకాశ మేర్పడును.

ఈ విధముగ యుక్తవయస్సు వచ్చుసరికి ప్రతివ్యక్తికిని కుటుంబమందు క్రమశిక్షణ, నాయకత్వము, సహకార భావము, త్యాగము మున్నగు సుగుణము లలవడును. యుక్తవయస్సు వచ్చిన పిదప పౌరులు సంఘమందును, రాజ్యమందును పాల్గొనవలసిన విధి కల్గును. సంఘమును, రాజ్యమును యథార్థముగా కుటుంబముయొక్క విశాల స్వరూపములే. ఉదార చరితులకు వసుధయే కుటుంబమని పెద్దలు చెప్పుదురు. కనుక కుటుంబమున నలవరచుకొన్న సుగుణములు పౌరత్వ ధర్మము నిర్వహించుటలో వినియోగించినయెడల ప్రతి వ్యక్తియు ఉత్తమ పౌరుడుగ మెలగగలడు.

5. రాజ్యాధికారము హెచ్చిన కొలది పౌర స్వాతంత్ర్యము తగ్గును—ఈ అభిప్రాయమును చర్చింపుము.

జ. సాధారణముగా 'స్వేచ్ఛ' అను పదమునకు ఎవరి యిచ్చవచ్చినట్లు వారు మెలగుటకు గల స్వాతంత్ర్యము అను భావము వ్యాపించియున్నది. కాని ఆచరణలో అది సంభవము గాదు. ఏలయనగా రాజ్య శాసనముల వలన వ్యక్తి స్వాతంత్ర్యమునకు కొన్ని విధినిషేధము లేర్పడుచున్నవి. అందుచేత వ్యక్తి స్వేచ్ఛకును, రాజ్యాధికారమునకును పరస్పర

విరోధము కలదని కొందరి వాదము. శాసనములు పౌరుల స్వేచ్ఛకు భంగకరము అను అభిప్రాయ మొకటి ప్రబలియున్నది.

కాని అది తప్పు అభిప్రాయమని నిర్ధారణగా చెప్పవచ్చును. ఏల యనగా స్వేచ్ఛయను పదమునకు హద్దులేని స్వాతంత్ర్యమని అర్థము కాదు. సంఘమునం దెవరి యిష్టానుసారము వారు ప్రవర్తించినచో రాయున్నవానిదె రాజ్యమను అరాజకస్థితి యేర్పడి బలహీనుల ఆస్తి ప్రాణములకు రక్షణ యుండదు. నిరవధికమైన స్వాతంత్ర్యమే ప్రతివ్యక్తికిని ఉన్నచో దొంగలకును, హంతకులకును శిక్షయే యుండదు.

కనుక సంఘమందలి అందరి హక్కులును బీదసాద అను భేదము లేకుండా-సంరక్షింపబడవలె నన్నచో సర్వాధికారముగల రాజ్యమును, శాసనములును ఉండుట అవసరము. రాజ్యము తన శాసనములద్వారా వ్యక్తుల స్వాతంత్ర్యమును సమన్వయపరచి సంఘమందలి ఒకవ్యక్తి మరొకవ్యక్తి స్వేచ్ఛకు భంగము కలుగకుండ కట్టుదిట్టముచేసి, ప్రతి పౌరునకును న్యాయమగు స్వేచ్ఛ ననుభవించుటకు వీలు నొసగును. కనుక యథార్థమగు స్వేచ్ఛ పౌరులకు రాజ్యాధికారము వలననె లభించును. స్వేచ్ఛకు సృష్టికర్తయు, స్వేచ్ఛను సంరక్షించు భారము కూడ రాజ్యమునందె గలదు.

అయితే వ్యక్తి స్వాతంత్ర్యము పెంపొందుట ఆ యా దేశములందలి రాజ్య స్వరూపముపై ఆధారపడియుండును. నిరంకుశ ప్రభుత్వములోని పౌరుల వ్యక్తి స్వాతంత్ర్యము సహజము కుంటువడును. కాని ప్రజాస్వామిక ప్రభుత్వ విధానములో ప్రజలె పరిపాలకు లగుదురు. గనుక పౌరుల స్వాతంత్ర్యరక్షణకు సహజముగా వీలు ఉండును. అందుచే రాజ్యాధికారము మితిమీరుట కవకాశ మేర్పడదు.

**6. ఆంధ్రరాష్ట్రములోని నగర పరిపాలనా పద్ధతిని సంక్షిప్తముగా వివరింపుడు.**

ఆంధ్రప్రదేశ్‌లో పటణములందు స్థానిక పరిపాలనా విధానముస

పెంపొందించు నుద్దేశముతో మునిసిపాలిటీ లేర్పరుపబడినవి. రాజధాని నగరమందు కార్పొరేషను ఏర్పడియున్నది. సాధారణముగ ఏబదివేల జనాభాకు పైబడిన పట్టణములలో మునిసిపాలిటీలు గలవు.

మునిసిపలు పరిపాలనా విధానము మునిసిపల్ కౌన్సిల్ చే నిర్ణయింపబడును. మునిసిపల్ కౌన్సిలు ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులచే ఏర్పడును. పట్టణమందు నివసించు వయోజనులు మునిసిపల్ కౌన్సిల్ సభ్యుల నెన్నుకొను వోటర్లుగా నుందురు. ఒక పట్టణము కొన్ని వార్డులు (భాగములు) గా విభజింపబడును. ఒక్కొక్క వార్డులోని వోటర్లు మునిసిపల్ కౌన్సిలుకు తమ ప్రతినిధి నెన్నుకొందురు. సాధారణముగా పట్టణ విస్తీర్ణమును బట్టి ఒక మునిసిపల్ కౌన్సిలులో ఇరువదియైదు మంది మొదలు ఏబది మంది వరకు సభ్యులుందురు. వీరందరును సమావేశమై తమలో నొకనిని చెయిర్మనుగను, మరియొకరిని వైస్ చెయిర్మనుగను ఎన్నుకొందురు. చెయిర్మన్ మునిసిపల్ సభలను జరపి అధ్యక్షత వహించును. చెయిర్మను లేనప్పుడు వైస్ చైర్మన్ ఆ పనులు నెరవేర్చును. మునిసిపాలిటీయొక్క బడ్జెట్ (ఆదాయ వ్యయములు) నిర్ణయించి మునిసిపాలిటీ కార్యకలాపముల విధాన సూత్రములను మునిసిపల్ కౌన్సిల్ సభలలో చర్చించబడి తీర్మానింపబడును.

మునిసిపల్ కౌన్సిలు కార్యక్రమము నిర్వహించుటకు కమీషనర్ అను ప్రభుత్వోద్యోగి యుండును. పట్టణమందు పారిశుధ్యము, మంచినీటి సరఫరా, మురుగునీటి పారుదల, దీపముల ఏర్పాటు, ఎలిమెంటరీ సెకండరీ పాఠశాలలు నడపుట—ఇట్టివి మునిసిపాలిటీలు నిర్వహించవలసిన పనులు.

ఇండ్లపన్ను, వృత్తిపన్ను, నీటిపన్ను, వినోదపుపన్ను, మార్కెట్ల పన్ను—ఇట్టివి మునిసిపాలిటీలకు ఆదాయమార్గములు. ప్రభుత్వము కొన్ని సెస్సులను గ్రాంట్లను ఇచ్చును.

మునిసిపాలిటీల ఖర్చు వెచ్చములను ఆడిట్ శాఖవారు తనిఖీ చేయుదురు. పరిపాలనను జిల్లా కలెక్టరు అజమాయిషీ చేయును. ఇన్స్పెక్టర్ జనరలు ఉత్తరవులకు లోబడి మునిసిపలు పరిపాలన జరుగుచుండును.

**7. సంసదాత్మక ప్రభుత్వమండలి ముఖ్యాంశములు వివరింపుడు**

జ. ప్రజాస్వామిక ప్రభుత్వములు రెండు విధములగు లక్షణములను కల్గియున్నవి- (i) ప్రజాప్రతినిధి పరిపాలనా విధానము (Parliamentary Government) లేక మంత్రివర్గ పరిపాలనా విధానము (Cabinet Government) (ii) అధ్యక్ష పరిపాలనా విధానము (Presidencial Government).

వీనిలో పార్లమెంటరీ పరిపాలనా విధానము కొన్ని ముఖ్యసూత్రములపై ఆధారపడియున్నది. ఈ విధానమునందు పార్లమెంటులో ఏ రాజకీయ పక్షమునకు మెజారిటీ (అధిక సంఖ్యాబలము) ఉండునో ఆ పక్షమునుండి మంత్రివర్గ మేర్పడి పరిపాలన ఆ మంత్రివర్గపు అధీనమున నుండును. ఆ పార్టీ నాయకుడు ప్రధాన మంత్రియై మంత్రివర్గమందలి తన సహచరులను ఎంచుకొని మంత్రివర్గ సభ్యుల (Cabinet Ministers) జాబితాను తయారుచేసి వారు నిర్వహింపవలసిన పరిపాలనా శాఖలను ఏర్పాటుచేయును. మంత్రివర్గ సభ్యులందరును ఒకే తాటిమీద నడచునట్లు జాగ్రత వహించి సమిష్టి బాధ్యత (Collective responsibility) అనగా ప్రభుత్వ చర్యలకు మంత్రివర్గమంతయూ కలసి సొంతముపై బాధ్యత వహించు విధానము అమలు చేయును. పార్లమెంటరీ విధానములో మంత్రివర్గ సభ్యులందరును సాధారణముగా దిగువసభ (Lower House) లో సభ్యులైయుందురు. శాసన సభలో తమకు అధిక సంఖ్యాబలము (Majority) ఉన్నంతవరకు మంత్రివర్గము పరిపాలనాధికారము కల్గియుండును. ఏదైనను ఒక ప్రధాన సమస్యపై తమకు శాసనసభయందోటమి కల్గినచో మంత్రివర్గమంతయు రాజీనామా చేయవలసియుండును. విశ్వాస రాహిత్యతీర్మానము (Vote of No Confidence) ద్వారా శాసన సభ్యులు మంత్రివర్గమును తొలగింపవచ్చును. శాసనసభాసభ్యులు పరిపాలనా సంబంధమైన ప్రశ్నలడిగినపుడు (Interpollation) మంత్రులు తగిన సమాధానము చెప్పవలసియుండును. ఈ విధానము పార్లమెంటరీ

విధానము, కేబినెట్ విధానము లేక బాధ్యతాయుత విధానము (Responsible Government) అని పేరు. ఈ విధానములో మంత్రి వర్గము శాసనసభకు బాధ్యత వహించియుండును. ఇంగ్లండు, ఇండియాలు ఈ విధానమున కుదాహరణములు.

ప్రెసిడెన్షియల్ విధానములో (President) అధ్యక్షుడు ఎన్నుకొనబడిన పిదప తన కార్యదర్శులు (Secretaries) తానే నియమించు కొనును. వారు పార్లమెంటుకు బాధ్యులుకారు. U. S. A ఇందు కుదాహరణము.

8. సంయుక్త రాజ్యపద్ధతి వలన లాభనష్టము లేవి?

జ. ప్రభుత్వ స్వరూపములు రెండు విధములు—

(1) Unitary Government (ఏకకేంద్ర రాజ్యపద్ధతి).

(2) Federal Government (సంయుక్త రాజ్యపద్ధతి).

ఒక రాజ్యమున కంతటికినీ ఒకే ప్రభుత్వసంస్థ అధికారము వహించిన యెడల అది ఏక కేంద్రరాజ్యపద్ధతి అనబడును. ఒక రాజ్యములో వేర్వేరు రాష్ట్రప్రభుత్వములుండి, రాజ్యమంతటికినీ అధికారము వహించు కేంద్ర ప్రభుత్వముగూడ నుండు విధానమును సంయుక్త రాజ్యపద్ధతి యందురు. యూనిటరీ ప్రభుత్వ పద్ధతికి ఉదాహరణ ఇంగ్లండు. సంయుక్త రాజ్యపద్ధతికి ఉదాహరణము U. S .A. (అమెరికా సంయుక్త రాష్ట్రములు) ఇండియన్ యూనియన్.

సంయుక్త రాజ్యపద్ధతివలన కొన్ని సదుపాయములు గలవు. ఏ ప్రాంతమున కాప్రాంతము స్థానిక పరిస్థితులకును, స్థానిక సంస్కృతికిని అనుగుణముగ అభివృద్ధి పొందుచు కేంద్రప్రభుత్వమువలన గూడా రాజ్యము మొత్తమునకు చెందిన రక్షణ పొందవచ్చును. సంయుక్త రాజ్యపద్ధతి వలన రాజ్యమునందు అధికారము కేంద్రీకరింపబడి నిరంకుశత్వ మేర్పడునను భీతిలేకుండా కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వమునకును అధికార విభజన జరుగుటవలన అధికార వికేంద్రీకరణమున కవకాశము గల్గును.

సంయుక్త రాజ్యపద్ధతిలో రైళ్లు, తపాలా సౌకర్యములును కేంద్రప్రభుత్వాధీనమందుండుటచేత వ్యవహారములో సౌలభ్యము ఏర్పడును. సంయుక్త రాజ్యమందలి పౌరులు రాష్ట్ర కేంద్రప్రభుత్వముల యెడల భక్తి చూపవలెను. కనుక కేవలము స్థానిక దురభిమానము వదలి క్రమముగా అంతర్జాతీయతత్వ మలవరచుకొనుటకు త్రోవ యేర్పడును.

సంయుక్త రాజ్యపద్ధతిలో కొన్ని నష్టములును గలవు. వివిధ రాజ్యముల మధ్య స్పర్ధలేర్పడవచ్చును. రాష్ట్రమునకు చెందినవి కొన్ని, కేంద్రమునకు చెందినవి కొన్ని—ఇట్లు వేర్వేరు చట్టములు ప్రజల కిబ్బంది కలిగింపవచ్చును. రెండు విధములైన పరిపాలనల వలన ఖర్చు ఎక్కువగును. ఒక్కొకపుడు కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వములకును అభిప్రాయ భేదము కల్గి అరాజక మేర్పడవచ్చును. ఏది యేమైనను విశాల రాజ్యములకు బలమైన కేంద్రప్రభుత్వము గల సంయుక్త రాజ్యపద్ధతి అనుకూలమైనది.

## 9. శాసనసభ యందు బిల్లు చట్టముగ పరిణామ మొందు రీతిని వర్ణింపుడు.

జ. శాసనసభలో ముసాయిదా తీర్మానము (Bill) చట్టమగుట కొక నిర్ణీత విధానము గలదు. ఒక బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టదలచుకొన్న సభ్యుడు ఆ బిల్లు కాపీని స్పీకరుకుగాని సెక్రటరీకిగాని అందచేయవలెను. ఒక నెల రోజుల పిదప శాసనసభలో చర్చకు వచ్చును. బిల్లు ప్రవేశపెట్టు సభ్యుడు మొదటి దశ (First Reading) లో బిల్లు ప్రవేశపెట్టుటకు సభ్యుల అనుమతి కోరవలెను. అప్పుడు బిల్లు ప్రతిపాదకుడు బిల్లు ఉద్దేశములు సంగ్రహముగా తెల్పును. సభలో అధిక సంఖ్యాకులు (మెజారిటీ) అందుకంగీకరించిన యెడల ఆ బిల్లు నకలు గజెట్ లో ప్రకటింపబడును. తర్వాత ఆ బిల్లు సభలో మొదటిదశలో (First Reading) సామాన్య సూత్రములపై చర్చ జరుగును.

ఈ దశలో సభ్యులు మూడు విధములుగా ప్రతిపాదనలలో నేదైన చేయవచ్చును—(i) బిల్లును రెండవదశలో చర్చ (Second Reading) (ii) బిల్లును ప్రత్యేక సంఘమునకు (Select Committee) కి పంపుట. (iii) బిల్లును ప్రజాభిప్రాయమునకు పంపుట (Select Committee) కి పంపబడినచో అందుకై నియమింపబడిన సంఘమువారు బిల్లులో అంశములను తగురీతిని సవరింతురు,

పిదప మూడవ దశ (Third Reading) లో చర్చజేవచ్చును. అప్పుడొక్కొక్క క్లాజును ప్రత్యేకముగా చర్చించి తీర్మానింతురు. ఈ దశలో సభ్యులెవరైనను బిల్లుకు సవరణలు ప్రతిపాదింపవచ్చును. సవరణలో గూడ ఒక్కొక్క క్లాజుపైనను స్పీకరు ఓట్లు తీసికొనును.

ఒక సభలో బిల్లు చర్చ పూర్తియైన పిదప రెండవసభ యున్నచో అచ్చట చర్చ జరుగును. అచ్చటగూడ తీర్మానమైన తర్వాత ఆ బిల్లు దేశాధ్యక్షుని (President) యొక్క అంగీకారము (Assent) పొందవలెను. అట్టి అంగీకారము పొందినమీదట బిల్లు శాసనరూపముదాల్చి అమలులోనికి వచ్చును.

10. ప్రపంచశాంతికి ముఖ్యాధారములేవి ?

జ. ఇరువదియవ శతాబ్దమున రెండు ప్రపంచ మహాసంగ్రామములు జరిగినవి. 1914-1919 జరిగిన మొదటి సంగ్రామముకంటె 1989-44 వరకు జరిగిన రెండవ సంగ్రామము మహా ఘోరముగా పరిణమించినది. ఏలయనగా ఈ యుద్ధము ప్రపంచమందన్ని దేశములలోను వ్యాపించుటయే గాక భూ, జల, ఆకాశములందు ఈ యుద్ధము వ్యాపించినది. అటంబాంబు వంటి మారణాస్త్రములు ప్రయోగింపబడి కోట్లకొలది జనులు నష్టమైరి. యుద్ధ మంతమై ఎంతోకాలమైనను ఆర్థికముగను, ఆరోగ్య విషయమునను ఇతర విధములచేతను ఆ యుద్ధపు దుష్ఫలితములు కలుగుచునే యున్నవి.

మొదటి ప్రపంచయుద్ధము తర్వాతను, రెండవ ప్రపంచయుద్ధము తర్వాతనుగూడ యుద్ధము అనర్థకరము అగుటచే యుద్ధములు నివారణచేసి

ప్రపంచశాంతి స్థాపింపవలెనను ఆశయమును అన్ని రాజ్యములవారును అంగీకరించియున్నారు. మొదటి యుద్ధము తర్వాత స్థాపింపబడిన నానా జాతి సమితి (League of Nations) పనిచేయుచుండగనే రెండవ ప్రపంచయుద్ధమారంభమైనది. రెండవ ప్రపంచ యుద్ధానంతరము ఐక్య రాజ్య సమితి (U. N. O.) స్థాపింపబడినది: అయినను ప్రపంచమున దురాక్రమణలు జరుగుచునే యున్నవి. చైనా భారత సరిహద్దులలో జరిపిన దురాక్రమణయే ఇందుకు నిదర్శనము.

ప్రపంచశాంతి స్థాపించు ప్రయత్నములకుముందు యుద్ధకారణముల నివారించుట అవసరము. రోగమును మాన్పుటకుముందు రోగకారణములు గ్రహించి వాని నివారణకు యత్నించుట వైద్యుని ధర్మముగదా!

యుద్ధములకు మూలకారణములు రాజ్యకాంక్ష, స్వార్థపరత్వము, పరపీడనము అనునవి ముఖ్యమైనవి. మనస్ఫూర్తిగా వీటిని అన్ని రాజ్యములును వదలిపెట్టిననేగాని ప్రపంచశాంతి స్థాపింపబడదు. ఒకవైపు శాంతి సంస్థలు స్థాపించుచు మరొకవైపు మారణాయుధములు పెంపొందించుకొనుట ప్రపంచశాంతికి విరుద్ధము. కనుక నిరాయుధీకరణకు మనస్ఫూర్తిగా అన్ని రాజ్యములును సంసిద్ధమై యుండవలెను. నానాజాతి సమితిగాని ఐక్యరాజ్య సమితిగాని మరి ఏ సంస్థగాని తన నిర్ణయముల నమలు జరుపు బలమును శక్తిని గలిగియుండవలెను. గాని శుష్కతీర్మానములు నిష్ప్రయోజనములే యగును. ప్రపంచరాజ్యము (World State) స్థాపించుటయే ప్రపంచశాంతికి సాధనమని కొందరి అభిప్రాయమై యున్నది.

ముఖ్యముగా అగ్రరాజ్యములు తమ విపరీత ప్రాధాన్యము తగ్గించుకొని చిన్నరాజ్యములతో సహజీవనము (Co-existence) నకు హృదయపూర్వకముగా యత్నించుట ప్రపంచ శాంతికి మూలాధారము.

S. R. P. WORKS, RAJAHMUNDRY